ఉత్తమరచన తీరుపులోని భాగ మెక్కడికాగిన తానక్కడి కాగుచు, చదివెడువానికి సుఖముగ నుండు నట్లు, శ్వాస కవకాశమిచ్చుచు గ్రుక్క త్రిప్పుకొన వీలుండునట్లుగా నుండవలెను. శర్మగారి రచనలో ఈ శ్వాసగతి ననుసరించెడి వాక్యవిన్యాసము గమనింప దగినది. లయననుసరించి ముందు మనవి చేయుదును.

పోల్చి చెప్పదలసిన విషయములో శర్మగారి వచనము తిక్కన రచనవంటిది. ఇరువురిలోను కొన్ని సమాన ధర్మములున్నవి—వాక్యముల కూర్పునను, పదముల కంటె తలపు నొత్తిచెప్పుపద్ధతి, ఇమిడిక. తలపు ప్రధానమైనపుడు మాటల తేటగా నుంచజేయుట రచన లోని యొక మర్మము. అట్లే నొక్కి చెప్పదలచిన భాగమున దానికి కలుగునట్లు అక్షరావృత్తి చూపించు టయో లేక స్ఫుటముగా వచనమైనను యతి వేయు టయో తిక్కన వ్రాత వాడుక. శర్మగారి వాక్యముల బరిశీలించుటకు ముందుగా చేతికివచ్చిన కవి బ్రహ్మ వాక్యమును నించుక చిత్తగింపుడు.

“అనిన విని రథికవరు లందఱు ‘సహదేవుం డింత యొప్పవాడు నీ సాత్యకికి పలుకు లిట్లుండునే! తక్కటివి యొక్క సరి మాటలు? పగవారి నడిగికొనం బోవుట యుచితంబె? కయ్యంబు కర్జంబుగాదె? ధర్మంబు నీగికొనం దగదె?’ అనునివి మొదలుగా ననేకు లనేక ప్రకారంబుల వీరాలాపంబులం గొలువెల్ల నొక్క మ్రోతగా చెలంగిన యెలుంగులు నింగి ముట్టె.”

(ఉద్యో. 3. ఆశ్వా.)

ఈ వాక్యమునందు మొదట సామాన్యమగు అక్షరావృత్తి. రెండవచోట రెండు చిన్నవాక్యము లుగ విరిచి వ్రాయుట సహదేవసాత్యకులకు తుల్యత నేర్పరచుటకు. మూడవచోట ఉద్రేకము. నాల్గవ చోట ప్రతిపదము నూది చెప్పుటచే పదాదిలో కకారా వృత్తి. చివరి వాక్యమున ప్రతిసుధగత్వమునకై ‘మొదలుగా’ ‘మ్రోతగా’ అనుచోట్ల యతి వేయబడి నది. ఇందలి తత్తత్ స్థానములందలి న, ల, ర, ల ద్విరావృత్తి, ‘చెలంగిన ఎలుంగులు నింగి ముట్టె’ నను చోట్ల బిందుపూర్వక గకారావృత్తి పాఠకుని కప్పటి కలకలమును దాని కఱకుదనమును మనసుకు తట్టించు ననుటలో సందేహ మేమి?

శర్మగారి రచనలో ఇట్టి అక్షరావృత్తి వాక్య మును పట్టాలమీద రైలుబండి నడచినంత సుఖముగా నడిపించును. సామాన్యముగ వ్రాసిన ఈ వాక్యమున గల అక్షరావృత్తిని గమనింపుడు: ‘కారణ మేమనగా వారాకలికి భుజించువారే కాని మోమోటమునకు గాని పద్ధతి ప్రకారముగాని ఇష్టము లేకున్నను భుజించు వారు కారు.’

పాఠకుని మనసు ప్రత్యగ్రముగ తలపుపై నిలువ వలెనన్నచో అక్షరావృత్తిలో వైవిధ్యముండితీర వలెను. ఆ యక్షరావృత్తియు నా వాక్యమునందలి ఏ చలితాంశ కా చలితాంశలోనే పరిమితముగ నుండవలెను. ఈ వాక్యమును చిత్తగింపుడు.

‘విష్ణుచిత్తుడంత విరక్తసంసారియై ‘అబుద్ధేక్షు ధనుఃపరిశ్రుతుడైనను, వానకాలమున భార్య వంటచేసిన పాక దగిలి యామె కన్నులు నొచ్చునేయని ముందుగానే వంకాయ బొంగ్లముల నెంపించి సిద్ధముగా జేసి పెట్టుకొనవలసెను.” ఇందలి మొదటి చలితాంశలో సగము వ్యాసకర్తది. తక్కిన సగము కృష్ణరాయలది. తన సగములో ‘వి’ ద్విరావృత్తమైనది. ప్రధాన వాక్యమున రెండుచోట్ల యతి వేసినారు. తొలి చలి తాంశలోని రెండవసగమునగల మాటలు రాయలవి గనుక రాయలదే అయిన ప్రధానవాక్యార్థమునకు చెందిన ‘కన్నులు’లోని ‘ను’ వర్ణముతో ‘ఇక్షుధనుః పరిశ్రుతు’నచోటి ‘ను’వర్ణమునకు ఆవృత్తి చూపినారు.

ఇట్లు, అక్షరావృత్తియో యతియో అన్ని చోటుల నిర్వహించినను అది బయటికి పొక్కక అణగియుండుటయే రచనలోని గొప్పదనము. తిక్కన పదమధ్యాక్షరములతో యతిని నిర్వహించినట్లుగ శర్మ గారును పదమధ్యాక్షరములతోనే రెండుచోటుల గాకున్న ఒకచోటనైనను ఆవృత్తియో, యతియో చూపినారు. ఈ చిన్నవాక్యమును చూడుడు:

‘వరూధిని యెన్నిమాఱులు జ్ఞప్తికి దెచ్చుకొన్నను తాను దేవత యను విషయము మఱచి పదేపదే మనవలె చెమర్చును.’

‘వరూధిని’యన్న పదములోని వకారమునకు ‘దేవత’యన్న పదమధ్య వకారముతో యతి. ‘తెచ్చుకొన్నను’ అను దాని యాద్యక్షరమునకు ‘పదేపదే’ లోని రెండవ నాల్గవ యక్షరములతో యతి. ‘మాఱులు’ ‘మఱచి’ ‘మనవలె’ అనుచోట్ల పదాద్యక్షరముల కావృత్తి కన్పట్టి వాక్యార్థము స్ఫుటప్రతీతికి సహకరించును.

# రాళ్లపల్లివారి వచనరచన

తలపు నొక్కి చెప్పినచోట శర్మగారి వాక్యములు తిక్కన ననుసరించి పదాద్యక్షర మైత్రినే పాటించును; చూడుడు:

'రాజులుకూడ ఇట్టి భావములకు కొంతలోపడి యుండినను ఇంతకన్న నుదారమైన ధర్మదృష్టి యతని నొక ప్రక్కలో బలముగా నొత్తిడి చేయుచుండుటచే తాను సత్కృతికి లోగక తప్పించుకొని ధన్యుడైనాడు.'

ఈ వాక్యమున 'కూడ' 'కొంత' అను మాటలు తలపునకు నొక్కులు దీర్ఘముగా, 'భావములకు', 'లోపడి' అనుచోట్లగల కూడ ఆ చోటికి మాత్రమే పరిమితమై నిలువగా, 'ఉదారమైన ధర్మదృష్టి' 'ఒక ప్రక్కలో' 'ఒత్తిడిచేయుగా' అనువాని పదాద్యక్షర మైత్రి ఇంముకు దూరదూరమునుండి ప్రధాన కారణమును పైకి దెచ్చి చూపింపగా, 'తాను సత్కృతికి లోగక తప్పించుకొని ధన్యుడైనాడు' అను ప్రధాన వాక్యభాగము అన్యవహితమైన పదాద్యక్షర మైత్రిచే అర్థమును ముద్రవేసినట్లుగ చెప్పుటకు సహకరించుచున్నది.

సాధారణముగ వచనమున—అందునను ఉపన్యాసములకుగా వ్రాసినదానిలో-వక్రోక్తియే ప్రయోజన సిద్ధి కుపయోగించునది. కేవలము దర్పణమే అంది వచ్చినట్టి ధ్వని వచనమున నుండుట గొప్పగుణమే కాని అంతట మన అక్కర తీర్చునట్టిది గాదేమో! శర్మగారి రచనలో సద్యస్స్ఫూర్తిగల వక్రోక్తి పలుతావుల గాన్పించును. మచ్చునకు: 'ఒక వేళ నాశపడినను మన మేమి ఒకరిపై పూనికొనగలమా? మన దేహములు మన అధీనములా? వడ్డివాని కమ్ముకొన్నవి! వాడు మన కష్టనిర్బంధనము చేసి మనస్వేదపరిమళమును మన దేహముమీదనే భద్రముగ రక్షించి పెట్టుచున్నాడు.' ఇందలి తొలివాక్యములలోని కాకువ్యాక్షిప్తమైన వక్రోక్తిని గమనింపుడు.

తిక్కన రచనవలెనె శర్మగారి రచనయు ఒక్కొకచోట ఎక్కడలేని ఇమిడిక చూపును. 'అల్పాక్షరముల ననల్పార్థ రచన' చేయుటమని చెప్పిన వారెంతమాత్రము చేసిరో చెప్పుట కష్టమేగాని వాటి తిక్కనయు నేటి శర్మగారును చేసినారని చెప్పవచ్చును. ఈ వాక్యము చూడుడు: 'ఉండునది ఉండవచ్చునట్టిది ఉండవలయునట్టిదియు నగు వస్తువును బ్రదర్శించుటతోడనే కళలన్నియు మొదలు పెట్టును.' ఇందలి మొదటి మూడుపదములకు కళలపరముగ మూడు పేజీల వ్యాఖ్యానము వ్రాయవచ్చునుగదా!

అంతేకాదు ఆ యిమిడిక కొన్నిసార్లు మనకు పరిచితముగాని వాక్యవిన్యాసమును కల్పించి చమత్కారము చూపించును.

"అట్లైన మన కింత తలనొప్పి లేకుండ 'విశ్వకర్మ వంశ్య వినుర వేమ' యనియే వేమన వ్రాయవచ్చుగానుండెనుకదా!"

వాక్యరచనలోని విశేషములకు వచ్చినచో నింక, మనము సాధారణముగా వాడెడు చేదర్థక సముచ్చయార్థకములు లేకయే పని గడుపుకొని పోగలరు'...'వారింటి వానికి వేమన జీవితమును తెలిసికొనవలెనన్నపుడు కలుగు కష్టము చెప్పలేము.'

మనము నిరంతరా మర్థములేని పదముల క్రింద జమకట్టి వాడు మాటలను అదికినట్లుగ వాడుట శర్మగారి అలవాటు. 'అక్కడికిని వారు కోపము నవలనియోపల నిగుడురికిని (తలుముగలదు) విడుగడ గావలసినదే.'

మరి 'శబ్దశాస్త్ర నియమాలను ఎదిరించె దొమ్మగాళ్ళు అప్పుడప్పుడుంటేనే ఏ భాషైనా ప్రవాహినిగా నడుస్తుం'దని 'త్యాగయ్య వాదసుధారసము'న వ్రాసిన శర్మగారు ఆ దొమ్మ తాముకూడ తగినంతగా చూపినవారే. పుస్తకములలో గ్రామ్యప్రకృతికములుగా నున్న అన్యాయము లెన్నియో వ్యవహారమున కెక్కినవి. శర్మగారు వ్యవహారమునుబట్టి రచన సాగించినారు. అట్లే సాధారణముగ షష్ఠీవర్ణమునకు ముందు నకారము వాడకపోవుట, 'లోపము' మొదలగు ప్రయోగములు ఆయన కిష్టములు. వ్యవహారముగూడ నంతే. కొందరు సరళాదిగ వాడు దిద్దు, గడప మొదలగు శబ్దములను తిద్దు, కడప ఇత్యాదిగ వాడుట శర్మగారి స్వమాండలికాభిమాన ఫలమనుకొందును.

వ్యవహారము ననుసరించి భాషకు జీవముపోసి గ్రాంథిక వ్యావహారిక భాషలకు భేదములేదని చూపిన శర్మగారి చేయి తిరుగులేనిది. నేను పరిశీలన కొగినంత వరకే ఆయన రచనలోని విశేషముల బ్రదర్శింప బ్రయత్నించితిని. అందలి తెనుగుతన మొక్కటే మాత్రము విస్తృతిచేతనేమి, వైవిధ్యముచేతనేమి సులభముగా వ్యాసములకు లొంగునదికాదు. శక్తిగలవారి చేతిలో తెలుగొక మహత్పదార్థమువంటిది. దానిని ప్రదర్శింప నేర్చిన శర్మగారికి నమస్కరించుటతప్ప చేయగల ప్రయత్నము కాన్పింపదు.

# కన్నె తలపులు

శ్రీమతి ఆర్. నాంచారమ్మ

నిలువు టద్దము ముందు నిలబడి
ఏమనో మరి చూపు త్రిప్పదు
ఏమి చూచెనో తనలో తానే
నవ్వ మంజులతన్ !

చంచలమ్ములునైన కన్నులు
నిశ్చలంబులు నయ్యె నయ్యెడ
ఎంత చూచిన తనివి తీరని
అంద మెయ్యదియో !

ఆమె మోమున మెరయు సంతత
ముగ్ధ మోహన హాస రేఖలు
తన్మయం బొనరించు తలపు ల
కెంత తియ్యనివో !

అంతలోననె విన్నబోవును
వాలిపోవును వదనపద్మము
ఎవ్వరెరుగుదు రామె హృదయపు
వింత వైఖరులన్ ?

గాలి పాటలో క్రొత్తయందము
పూవు తావిలో నవ్యభావము
చంద్రకాంతిలో నూతనత్వము
సృష్టియే కొంగ్రొత్తకే.

తళుక్కు తళుక్కున మెరయు నెడదలో
తా నెరుంగని భావ మేదో
మబ్బుచాటున తారకాళి మ
యూఖముల వోలెన్ !

# విశ్వనాథవారి మేనకా విశ్వామిత్రము

శ్రీ యస్వీ జోగారావు

కింపురుషాష్ట్రల కవితాశిల్ప సుందరనందనారామములో కల్పవృక్షము రామాయణము. ఆ కల్పవృక్షస్కంధశాఖయందలరారు నొక మధుకోశము మేనకా విశ్వామిత్ర ఘట్టము. వారి రామాయణమున వివిధఘట్టములందలి తీరు వేరు, దీనితీరు వేరు. ఇది విశ్వామిత్రుని కథయయినను ఆ పాత్రశీలము నతివిశిష్ట శిల్పముగా మలచియున్నను విశ్వనాథవారు దీనిని విశ్వామిత్రుని కథయనుటకంటె మేనక కథ యనుట కెక్కువ మోజు పడుదురు. ఏతత్కథా ప్రధానశ్రోత రాముడు. కథ యంతయు విని లక్ష్మణునితో

"అన్ని యంతమ్ములును జెప్పినట్టి తీరు
వేరు; మేనక కథ తీరు వేరుగాదె"

అని వక్కాణించినాడు. అట్టిది కవి అభినివేశము.

మూలమున పది యనుష్టుప్పులుగా నున్న కథ ముప్పది పద్యములుగా నిందు ముచ్చటింపబడినది. ఈ ప్రపంచీకరణము ప్రధాన కథా కలితార్థయుక్తికి భంజకమని భావింతురేమో కొందరు భావుకులు. వాల్మీకి వాఙ్మయమర్యాద నిందు డిందు వడినదనియును వారనుదురు గాక. కాని యీకథ శృంగారకథ. చెప్పుచున్నది శతానందుడు; జనక పురోహితుడు; అహల్యా గౌతముల అపత్యము. వినుచున్నది పదునారేడుల రాచబిడ్డలు రామలక్ష్మణులు. రాజర్షి జనకుడును ఒక శ్రోత. మరియు 'మహర్షి పరివృఢగురు డైన విశ్వామిత్రుని సముఖముననే కథనము సాగుచున్నది. ఇది యెంత మేనక కథయైనను నిందతను నొక పాత్రయగును గదా! అట్టిచో ఔచిత్య నిర్వహణ మెట అసిధారావ్రతమని వేర చెప్పనక్కరలేదు. ఇచటి రచన మాత్రము ఇది కవి యభినివేశము నాచికొన్న ఉజ్జ్వల రసవద్ఘట్ట మగుట నేమో వారన్నటులే కడముట్టుల రచన నతిశయించినది. అవ్యుత్క్రమాన్యమై పూటిగా సర్వతస్సుందరమై సాగినది — ప్రతిపద్య చమత్కృతిగ, ప్రతిపద మధురముగ, రస ప్రసన్నముగ

'మాకంద తరుశాఖికా కోకిలాలాప
కాహళాలంకార కలనజేసి
ప్రాంత ప్రసూనాయాత శీతానిలాహూత
సాంద్రపల్లవహస్త సంజ్ఞజేసి
రేఖాగ్రవద్వారి శాఖానదీవేణి
కా ప్రశంసిత దుకూల కాంతిఁజేసి
సామోద కహ్లార సంఫుల్ల నీరేరు
హాసక రాత్రి మోహనత జేసి
తరుణ శాలీన కోమలాతప విహారి
హృదయవాంఛా ప్రవృత్తిసమరేఖ జేసి
కలిత మరాళ కూజహాసంబుగా వ
సంతి వనశోభి వచ్చె నప్సరసవోలె"

వసంతి వనశోభి అప్సరవోలె వచ్చినదట! ఇదియొక అందమైన అవశ్యంభావి అవ్యవహితభావి కావ్యార్థ సూచన. అదియుగాక ప్రతి సంవత్సర జాతకంబున బుధ ప్రత్యగ్ర యోగంబుగా వచ్చునది వసంతము. అట్టి తపమొనరించు ఋషులకడ కింద్ర ప్రేరితలై అప్సరలు వచ్చుటయు సహజమను విషయ మిట సూచితము. సందర్భసుందరము, అలంకార చారువు, చమత్కార సమగ్రమునైన వర్ణన యిది. ఆ సీసపద్యపు నడకలో 'రసప్రసిద్ధధారాధుని' శ్రీనాథుని కైవారపు హుందాగిరీ యున్నది. ఆ వచ్చిన వసంతము మూనద్యము పరిమితమైన సామాన్యఋతువు కాదు. ఆ వచ్చిన యప్సర సామాన్యాప్సరస కాదు; 'పరమాప్సరస' (వాల్మీకి)యైన మేనక. ముని సన్నిధిని నిత్యఋతు ప్రత్యక్షమై పదిను లోకోత్తరముగా మధుర శాంభవ్యములు నెరపిన నిత్యయౌవన మనుమ నామచ్చరవోలె తానును పదేండ్లు నిత్యప్రత్యగ్రముగా నిలచిపోయిన దా వసంతము. అందుచే నిట వసంతమున కప్సరసతోడి పోల్చి నాయత్తపరచు ఆ ఉపమావాచకము 'వోలె' శబ్దము సర్వథా రమణీయార్థ ప్రతిపాదకము.

అప్పుడే జలకమాడి వచ్చినది మేనక. అప్సరస! ఆ రాక—

ఆరొయు మందహాసకళి
తానన దీధితి గాంచుచున్నగా
ధేయుని చైత్రమార్గ వరి
ధీకృతి మోహన మోహనాంగరి

ఖాయత మానగోపన వి
కంపిత ముగ్ధతరాంగుళీ గృహీ
తాయత సిక్తచేలకలి
తాంచిత కాంచిపదాభిరామయై.'

అప్సరః పాత్ర ప్రవేశమన్న నట్లుండెడలెను! మూలమున స్నానప్రసక్తి మాత్రము గలదు.

అందమైన యామెని జలకమాడి నిలువునిపాద మార్ద్రవసనాంచితయై యుండునప్పుడు మొట్టమొదటగా రసికదృష్టి నాకర్షించునది యామె కాంచీదామ పదంబగు నితంబము. కాన స్నానమాడిన మేనక మేని కాంచీదామ పదమ్మును చుట్టుముట్టిన విశ్వామిత్రుని చూపుల పారవశ్యమున కట్టి సద్యఃస్ఫురణ గలిగించిరి. ఆ సమాసమామె కాంచీదామమువలెనే సుదీర్ఘముగా శబ్దసుందరముగా సాగినది. తదుపరి నోరజూపు నొయ్యారము నొలుకబోయుచు నాట్యహేల తెలుపు నటుప్రచు 'మత్స్యాంకలంగ' అనగా త్రిభంగిగా నిల్చిన ఆమె మనోహరభంగిమ సుకల్పితము. ఇక విశ్వామిత్రుని వాలకము—అతని మీసమునుండి దూసుకొని వచ్చిన రసికత్వము గడ్డముమీదుగా జొమ్ముగా ప్రవహించి హృదయములోపల జొచ్చి చూపుల ద్వారా అభివ్యక్తమైనది. అప్పుడు 'అప్పుడు మాయ రిద్దరును హృత్సదనంబు కవాటముల్ బలెన్'.

ఈ రూపకల్పనము లతిమాత్ర మనోజ్ఞములు; అప్పటి మేనామానుల మానరాగ మధురిమలను సహృదయులకు జారలిచ్చునవి అంతలో వారి చూపు లక్షవంతిములకు నవ్వులుగా పరిణమించినవి. పాపము! ముని (ఆ ముని కథకుడైన శతానందుని ప్రక్కనే యున్నాడు. అయినను 'త' ముని మనుటలో మర్మము ఆ వెనుకటి విశ్వామిత్రుని తీరువేరని స్ఫురింపజేయుటయే యగును.) 'ఓరకవానిపోరుమిదే! బిబ్బోక కేళిముల్ పిడుగు పెట్టుగునా?' అని యుత్తరీయము సవరించి యందుల కొడిగట్టినాడు. అదియొక వ్రతిబాగుల రసికత్వము. పరి వారు తడిరొమ్ములు పేదుడిపెదవన పేదుడుచుకొందునని పెనగులాడిరి. ఆ పెనగులాటలో 'చివరిదైన ఫలము తడి కౌగిలింతగా బరిణమించె.' అనంతరము వారి శృంగారానుభవములో మరియొక భంగిమ మానినియొడిలో మేనక—'ఎడల్ పొడిచిన చూపులై వలపు పుక్కిలులై' 'నీవునీ'వని హెచ్చరించుకొని 'భావజభావనమోహపథావధిగాత్యమే నాహమ్మను కొనుచు, ప్రణయార్ద్రవతిభావనా ప్రకోపముతో సుఖించుచుండిరి వారు. 'క్రిందాచు మీదాచు వారల కేళీ విగ్రహంబు పట్టిదుగదా రామా! జగన్మోహనా!' అన్నాడు శతానందుడు—బ్రహ్మచారి రామునితో! బ్రహ్మర్షి విశ్వామిత్రుని సమక్షమున! మహర్షి పరివర్తనమున! ఆ యున్నది రామశబ్దమును పునశ్చరణ చేయుకయే యనియుండుట విశేషము!

విశ్వామిత్రుడు మేనకకు దన పర్ణశాల చూపించి స్వాగతమిచ్చినాడు. అప్పుడు 'పచ్చని వింటి జోదు మన బంటయి పల్లవ హస్తుడై' ప్రవాహి దిగునని అభయమిచ్చినాడు. 'అంతటి గరుతుయున్నదో' తన కథ్యంతరము లేదన్నది సాహసురాలు! అతని నిత్యనైమిత్తిక కర్మములెల్ల మాటుపడినవి ఆమె కుపచారములు చేయుటలో సరిపోయినది. ఆమె కర్ఘ్యపాద్యములుగా మద్యాలక్తక సమర్పణము, ధూపార్చన, కొప్పులో పూలు ముడుచుట మున్నగు నుపచారములు చేయుటతో నాతనికి ప్రొద్దుపోవుచుండెడిది. కొప్పులో పూలు ముడుచుటకు కొంత సమయము కొని పారాణి రాచుట పాదసేవ సేయుటేటి రసికత్వమను నవభావులు కొందరంగీకరింపరు. అందులకు మా సమాధానము: కాళిదాసు సాక్ష్యము. తన ప్రియకాలికి పారాణి రాచునంతలో ఇంద్ర ప్రేరితుడై ఈశ్వరుని తపోభంగము చేయుటకై పోయి అనంగుడై పడియున్న మన్మథుని తలచి రతీదేవి 'తపమం కురు దక్షిణేతరం చరణం నిర్మిత రాగమేహి మే' యని పురామనుర స్మృతులు తక్కడాలు పెట్టి యేడ్చినదట. (కుమార సంభవమున.) అసలు ప్రియురాలి పాదమునకు పారాణి రాచునంత మాత్రముచేతనే అదియొక ప్రౌఢరసికత్వము గాదట! ఆ పారాణి రాచిన పాదముచే నొక తాపుతిన్న రసికుని జన్మమే చరితార్థమగునట! వాడే భగవంతుడగు మన్మథునకు కడు కూర్చువాడట!

'పాలత్తకేన నవపల్లవకోమలేన
పాదేన నూపురవతా మదనాలసేన
యస్తాడ్యతే దయితయా ప్రణయాపరాధాత్
సోంగీకృతో భగవతా మకరధ్వజేన.'

(అమరుకము)

మరియొక మెట్టుపైకి ప్రాకినాడు పారిజాతము తాతగారు. సత్యాపాదతాడనము నొక ప్రాభవ విశేషముగా పరిగణించినా డతనికంటె ఘనుడు మకరధ్వజుని కన్నతండ్రి. ఇది యంతయు నొక చమత్కారమైన రసికత్వ తత్త్వరహస్యము. చూడుడు :

## విశ్వనాథవారి మేనకా విశ్వామిత్రము

'కోకిల కొమ్మలో గూసిన నీరచే
నన్ను బిల్చితి వంచు నవ్వుమాని
తుమ్మెద పాటలోన ఝుమ్మన నిదియేమి
మాటిలె మే యని మేలమాడు మాని'

ఇట్లు ప్రకృతి సర్వత్ర ప్రణయినీ మధురానుబంధ పులకితముగా గనుపట్టుచున్నది మానికి. అతడింక 'మానికౌను మమతచే వాచాల సార్వభౌముడయ్యె'నట. వాల్మీకి మాని పది యనుష్టుప్పులలో చెప్పిన గాథ నింతదూరము వ్యాకరించిన విశ్వనాథవారి కీమాట చెల్లనంగునేమో! కాని యీ ప్రణయానుబంధములు వ్యాకరింపబడిన తీరు జూడుడు. అది మధురాతిమధురము, మనోహరము.

'తన పాద మామె పాదము జతగా బెట్టి
యాస్మత్పదంబు మోటని వచించు'

ఇంకను ఆ ముని ముచ్చట లేమని చెప్పను! అతని రసిక ప్రతిభ వసంతుని వలె నవనవోన్మేషభాసుర మగుచున్నది. ఈ ముచ్చట చూడుడు:

'చెక్కిలి చెక్కిలి జేర్చి గడ్డము గ్రుచ్చు
కొన్నదా యని గ్రుచ్చిగ్రుచ్చి యడుగు'

నట. ఇదియొక చిత్రమైన కుశలప్రశ్న. గడ్డము గ్రుచ్చుకొన్నదా యనుచునే మరియు గ్రుచ్చిగ్రుచ్చి యడుగుటేమి? అని యనరాదు. ఆ పునరుక్త క్రియా సమాభిహార మడుగుటకు సంబంధించినది కాని గడ్డమునకు సంబంధించినది కాదని గ్రహింపవలయును. ఈ సందర్భము నీపఠించినవారి నాయకుడును కాని సత్యభామతో 'చెల్వగు నీ పద పల్లవంబు మత్తను పులకాగ్ర కంటక వితానము దాకిన నొచ్చునంచు నే ననియెద'నన్న సత్యభామా విధేయుని విన్నపముకంటె యీ కుశలప్రశ్నయే యుదాత్తముగా నున్నది. అతని పులకలు తాత్కాలికములు. నవోద్భిదములు! అసహజములు, హాస్యములు. ఇతని గడ్డమో! మరి!

అంతటి ఋషి ఏమంత లేలిక మానిసియైపోయినా డనిపింపవచ్చును. కాని యాతని చిలిపితనమును ప్రౌఢముగా సమర్థించినారు కవిగారు. 'కైలాసముపైని దేవుడును లాచిన కామినియుంగు గల్గుటి, ప్రాసముదత్తుడైన బసివాడును బోలె జరించు లేదా' యని.

ఇప్పటి యీ మేనకావిశ్వామిత్ర ప్రణయఘట్టమునకును సీతారాముల ప్రణయఘట్టమునకును కొంత బింబప్రతిబింబభావము గలదు. గురుశిష్యులిరువురును 'రాజితమైన మోహము నిరంతరులై' ప్రవర్తించిరి. గురువు ఋషియగుటవలన బర్ణశాలలో 'వెదురుగొట్టాల నింపిన యిప్పపువ్వుల్లు తెచ్చి యుద్భరసు' నందిచ్చెనివాడు. శిష్యుడు రాజపుత్రు డగుట వలన 'కనకపాత్రికల నింపిన యిరారసముల దెచ్చి మైథిలికి' నందిచ్చెడివాడు. ఇరువురును కోకిలకూతను సాహిత్యపియూషపూరితిగా భ్రమించినారు. ఇరువురును దమ కరచరణములతో ప్రియురాండ్ర కరచరణములను పరిపోల్చి వారి మార్దవమును గుర్తెరిగినవారు. (బాల కాండము—పుటలు 255, 256—367,68) గురువునకు దగిన శిష్యుడు రామచంద్రుడు! (మేనకకును సీతకును సంబంధము లేదు.) రామునకు మామూలు అస్త్రవిద్యయేకాదు మన్మథాస్త్రవిద్యనుగూడ అనుగ్రహించిన గౌరవము దక్కవలెనన్న మాట విశ్వనాథవారి విశ్వామిత్రునకు! ఆ మాట విశ్వనాథవారి శ్రీరామచంద్రుడే స్వయముగా సీతమ్మవారితో నిట్లు సెలవిచ్చినాడు.

'శ్రీమనోనాథు లీలావిశేష మెనసి
సీత యో స్వామి! యెందు నేర్చితని యడుగ
నేను నేర్చిన దేమున్నదే? నతాంగి
కౌశికుం డుపదేష్టయౌగాని దనుచు.'

(బా. కా. పుట 368)

ఇంత సాధన మెన్నడు చేసినాడో రామచంద్రుడు! కాగు శతానందునికేన నివియున్నాడు. ఏకసంథాగ్రాహి మహానుభావుడు!

అట్టి రామచంద్రుని కొరతవింటెట్టిన ఆ ఋషి డింకను సెట్టివాడనగా, అవసరింపుడు. ఒక్క పెట్ట పదేండ్లపాటు ఆరు ఋతువుల నొక్కటిగా ఆకట్టిన ఘటికుడు. ఆ 'మానిధియంబువలన' ఆగు ఋతువులు నాశ్రమమున వసంతమొక్క 'యభినయించు'చున్నవట. ఇదియొక మనోజ్ఞభావన. మరి ఆ అభినయ మెట్టిది? 'పూలతో లేతయెండల జాలుతోడ చివురుతో లేత వెన్నెల నవురుతోడ' కొనసాగినది. ఆ శియ్యారయొక్క ఊపులో నొక్క సమతాసుమము గోచరించి యవును ఆగు ఋతువు లొక్క సమంబ అవునవుననిపించుచున్నవి. వసంతమే యట్టిది. అది యొక్కటే వడ్రుతు స్వభావ గర్భితమును. ఆముని నిలుకడకు మేనక యునికియు ప్రబల కారణముగా వర్ణింపబడినది. యది మనోజ్ఞతరము. ఆమెది దేవమానము. ఆమె కదియొక లెక్క కాదు. అట్లు వసంతనిరంతరముగా సాగినది వారి ప్రణయము.

'ఈ మధుమాస మొక్క పదియేండ్లు సాగె' నన్న యీ పద్యపు పెత్తుగడ యెంతయు మనోహరము. కష్టకాలములో నిముసమేడై తోచునట్లు సుఖకాలములో జనులకు వత్సరములు దివసప్రాయములై తోచును. పదియేండ్లొక్క మధుమాసమువోలె గతించినవనగా అందు వారి సుఖానుభవాధిక్యస్ఫూర్తి సూచితము. ఈ సందర్భముచే మహర్షి వాల్మీకి 'అహోరాత్రాపదేశేన గతాః సంవత్సరా దశ' అని సూచించియున్నాడు. పదేండ్లొక్క యహోరాత్రమాత్రముగ గడచినవన్నమాట మరియు మనోహరము గదా!

అంతనొక నాడు మేనక గర్భిణియని గుర్తించి నాడు మౌని. అంతట 'గాధిజు కన్నులు విల్లు విరె'నట. అనగా తెలివిదేరె నాడనియు నంతకు ముందువాడు నిత్యకోపాగ్నిశీలుడైన యాతని నేత్రముల కిప్పుడీ మధురానుబంధము కారణముగా మంచి పరివర్తన గలిగి యాతని స్వభావమున కొక స్వచ్ఛత వచ్చినదనియు ఇంకను ఆ తెలివిలో అచ్చెరువుపాటు మొదలగు భావముల సంకేతామనియు నర్థమగును. 'ఒకనాడు ప్రాగ్వన నాశ్రమ పురస్థ నారికేళ ఫలయుంబులు లెక్క పెట్టి పదియేండ్లా బళి!' యన్నాడు. కొబ్బరిచెట్టుపై ఏటికొక ఫలయుగము మెత్తునట. అట్టి ఫలయుగములు లెక్కపెట్టి కొబ్బరిచెట్టు వయస్సుకొలుచుట మనవారికొక పరిపాటి. తెలుగువారి సంప్రదాయమిట చక్కగా ననుసంధింపబడినది. (ఇట్టి సందర్భము లితరత్ర పెక్కులు కలవు వీరి కావ్యమున) అంతట మౌనికి పశ్చాత్తాపము కల్గినది. 'విదిత్వప న్మునిసర్వః పశ్చాత్తాపేన దుఃఖితః' అని మూలము. అట్లు వాచ్యముచేయక పరిపరి విధముల నా పశ్చాత్తాప భావనను వ్యాఖ్యానించి తన పాత్రతో పఠితకు సానుభూతి కల్గునట్లు ప్రదర్శించినారు విశ్వనాథవారు.

'విప్రాః పశ్చాద్బుద్ధయః' అన్నారు పెద్దలు. అప్పటికి విప్రత్వ సముపార్జన వ్యాసంగమున నున్నాడు విశ్వామిత్రుడు. అందులకే మరల మరల వన్నె మారులా భోగతపస్సు. ఇక విప్రత్వము పొందుటకు తగిన యోగ్యత కొంత యేర్పడుచున్నదని సూచించుటకే ఆ పశ్చాత్తాపపరిస్థితి నంత పటువుగా చిత్రించినారనుకొందును విశ్వనాథవారు.

"అల్ల త్రిశంకు నాటిపగ
యంతయు దీర్చును నాకరాజితం
డెల్లతపంబువంగు ఘటి
యించును విఘ్నము స్వర్గగామికై
చెల్లును న్యాయమై యదియు
జేసిన మేనక కేమి తప్పు? తా
నల్ల సుపర్వరాజు వదు
పాజ్ఞల లోనిది యెంత చూచినన్"

ఇట్లు విస్పష్టముగా విశ్వామిత్రుని పరిస్థితి పరిణామము కార్యకారణసంబంధ పురస్సరము నొక చక్కని ఆరోహణావరోహణక్రమమున వెలార్చి యాతని హృదయ పరిణామము నానిముసముగా చూచి చూపిన కవి ప్రజ్ఞకదు ప్రశంసనీయము. ఆ చెప్పుట యెంత నిరాడంబర సుందరము! ఆ మామూలు మాటలలో ఎంత వాడిము! ఎంత శాంతికయున్నదని! 'ఎల్లయు దోసము నాదగు'నని నిర్ధారించుకొని నాడు మౌని. తన సంగతి సర్వము మునికి దెలిసిపోయినదని గ్రహించి నిలునిల్ల వణకుచు కన్నీరుగుట ప్రాంజలి వట్టి నిలుచున్న మేనకను జూచి 'ఒసీ యప్సర! నీవు నీకు వడదేలో తన్వి! నీ యందు నాదోసంబున్నది గర్భరూపముగ... శపించుదునె లేనాడు దోసానదా' అని అభయమిచ్చినాడు. ఆమె గర్భముతో తన కేమియు పట్టదన్నట్లుకాక కర్తవ్యము గూర్చి తగు నుపదేశమిచ్చినాడు వారుడు! మీదు మిక్కిలి తనకుం గడు మేలే పొనర్చినదని ఘనముగ ప్రశంసించినాడామెను. గతలించి పనికై కూలికి వచ్చినట్లయ్యును 'ఎవ్వదనో తులిచ్చిన నిను కల శపియింపవలయునే మధుమూర్తి!' అనియు, లౌకిక భోగతృప్తి కానిదే ఎంత తపస్సులు సిద్ధి పొందవనియు, ఆ తృప్తిపొందిన తన హృదయము నింక పట్టి కోకిల కూతియు ఆకర్షింపజాలదనియు, 'అసలు కోకిల యేమి నాకర్థమయ్యో' నీ కృపావేశమున జేసి నీరజాక్షి' యనియు తృప్తితో, కృతజ్ఞతతో, గుండె నిబ్బరముతో ఆత్మసాక్షాత్కారము పొందిన మహాయోగివోలె సుపన్యసించినాడు. ఇంక కొలదిలో ఆ స్థితి యవధిరేఖ నంటబోవుచున్నాడు. అప్పటినుండి ప్రతిపదము నతని హృదయమునందలి యొక్కొక్క మధుర స్పందనముగా మనకు గోచరించును. అతని లోని కోపము విసుగుగా, విసుగుదల యుపేక్షగా, ఉపేక్ష తృప్తిగా తృప్తి యౌదార్యముగా, ఔదార్య మూపదేశికతగా వివేకముగా ఉత్తమ మనస్వితగా పరిణమించిన క్రమము నతి నిశితదృష్టితో హృదయంగమముగా చిత్రించినారు కవిగారు.

కోకిలా మయూరములకు సంకేతములు. కోకిలగానమునకును, మయూరము నృత్యమునకును వాసికెక్కినవి. గానము రాగ ప్రధానము. నృత్యము భావాశ్రయము. ధాతువుతోపాటు మాతువును గలది కీర్తన. అనగా రాగ భావములకు సాహిత్య సౌహిత్యమును సంఘటించిన కళాకళ్యాణి మేనక.

ఈ కథపై కవికి ప్రత్యేకమైన మోజు కలదు. దీనికి ధంగ్యంతర సుందరముగా నొక ఫలశ్రుతిని గూడ రచించినారు వారు. ఆ కథవిని రాజర్షి జనకుడు బ్రహ్మర్షి విశ్వామిత్రుని కంజలిఘటించి సవిస్మితుని

'ఇంతగాంచి పదస్యులు నీ కుమార
యుగ్మకము వినుచుండె మహో నిధాన
మైన నీ కథా విస్తృతిగాని వినిన
వా నిరంతర మోదము జెప్పలేను స్వామి!'
'ఇవి రెండున్ గను చిత్రమైన యవి స్వా
మీ నాకునుం ద్వత్కథా
శ్రవణంబున్ రఘురామ చంద్రముఖ భా
స్వద్దర్శనంబున్ హృదం
త వికీర్ణంబయి లాగుచున్న యవి.'......

'స్వప్రశస్త కథా పరిపాటీశాఘు!' అని యుద్ఘాటించినాడు. ఏకాంతమ్మున శ్రీరామచంద్రుండు లక్ష్మణునితో

'ఈ ఋషులెవ్వరు చెప్పిన
పారకథా కథన మొక్క ఛాయనె నవచున్
వీరంతర్ద్రోపులు బహు
ధారాపిత సూక్ష్మతర కథాంశులు సుమ్మీ'

అన్నాడట. ఇది యింకొక గడుసుపోకడ. మొదటి సంగతి యొక కవి తన కావ్యమున కథలో కథగా ఆ కథను పాత్రముఖముగా వ్యాఖ్యాత మొనర్చుచున్నప్పు డాకథాగత కథాశ్రోత పొందిన యనుభూతిని సూచించు టదియొక శిల్పపు మెలకువ. జనకుని యనుభూతి ప్రసక్తి యాలమునందును నిందును గలదుగాని ప్రధాన శ్రోతయైన రాముని యనుభూతి విశేషమింగు వక్కాణింపబడినట్లు వాల్మీకమున లేదు. తన పూర్వాశ్రమగాథ తన సమక్షముననే చెప్పబడుచున్నపు డెట్టిదైన నేదో యొక యనుభూతి పొందక పోడు. అదికూడ కావ్యమున సూచితమైనచో నది యొక సొగసు. కాని విశ్వామిత్రుని యనుభూతి విశేష ప్రసక్తియందును నిందును గూడ లేదు. గంపెడ సంగతి! అసలీకథ మేనకదీకాదు, విశ్వామిత్రునిదీ కాదు. చెప్పినవాడు శతానందుడును గాదు. వాల్మీకమున నిట్లే యుండనులేదు. చెప్పినది విశ్వనాథవారు. దదివినది మనము. ఆ కథాకథన కౌశల మాఋషులది కాదు. విశ్వనాథవారిది. అట్లు పూర్వాపరసంఘటనలు పూసగ్రుచ్చినట్లు కథాసూత్రము లాగు నేర్పు, తన కథాశిల్పమును తానై సమీక్షించుకొనుచు నటనట ధంగ్యంతరముగా అభ్రశంస చేయు గడుసుదనము బహుముఖప్రజ్ఞా నిత్యులగు కవులకే కైవసమగు శిల్పముగాని యితరముకాదు. ఇంతకును రామాయణ సామ్రాజ్యమున విశ్వనాథవారి యేల్బడి తీరవేరు. కథ కమ్రపాతది ; శిల్పము సరికొత్తది.

# రిక్తహస్తాలు

## శ్రీ ప్రభల సత్యనారాయణమూర్తి

మస్తుగా త్రాగేసిన కండక్టర్ "రైట్... రైట్" అన్నాడు తోపివేసి వాడు హస్తంతో బలంగా చరుచుకుంటూ—తూలుతూ...

ఇంచుమించు అంతవరకూ పట్టించేసిన డ్రైవర్ బస్సు స్టార్టుచేశాడు.

ప్యాసింజర్లనుంచీ పన్నుని ఆటంకుండా బస్సు అమిత వేగంలో క్రిందకు దిగుతోంది. అటూ యిటూ ఉన్న అగాధాలను పరికించి ప్రయాణీకులు యావన్మందీ ప్రాణాలపై ఆశవదులుకున్నారు!!

* * *

అనుకూడదుగాని, అసలు బ్రహ్మదేవుడు ఏ ఉద్దేశంతో—ఏ క్షణంలో ఉండి రాఘవేంద్రాన్ని ఈ భూమ్మీదకు పంపించాడో! రాఘవేంద్రంకూడా పోని అని యిప్పుడైనా ప్రతిఘటించకుండా యింకా చూసుకుని ఈ లోకంలో మసలాలని ఆశిస్తున్నాడో!

ఆ అర్ధరాత్రి భోగం కొంపనుంచీ బయటపడి, యింటికి మళ్ళేసరికి కచ్చితంగా...మూడూ అయింది! ఆశ్చర్యం!! చడీ చప్పుడూ లేకుండా వినయవతే దిగి చక్కా వచ్చినట్లుగా యిల్లాలు తలుపు తీసేసరికి తనను తాను గిల్లి చూసుకున్నాడు...నాలుగు వేళ్ళతోనూ...యిది కలా నిజమా అని సందేహిస్తూ. అంత సులభంగా విశదమవలేదీ పరిస్థితి—

ఈ విధంగా ఆలస్యమైన ప్రతినిత్యం సందు మొగన తానుండగానే పసిగట్టి బుసలుకొట్టే వాచాల—ఈనాడిలా అయిపోయిందేమిటా సంప్రదాయ విరుద్ధంగా—అని ఆశ్చర్యపోతూ అలాగే నడవలో నిలబడి పోయాడు, చెప్పులు విడిచి. మరుక్షణంలో 'తన ఈ భార్య అమాంతంగా పరమభాగవతోత్తమురాలయి కూర్చోదుకదా కొంపతీసి' అనిన్నీ విచారించ సాగాడా రసికావతంసుడు!

తాపీగా వీధి తలుపులు బంధించింది రామాయమ్మ...రాఘవేంద్రం [illegible]. కిమ్మనకుండా కనుకొలకుల్లోనుంచీ అతగాడికేసి ఓ క్షణం పరికించి చూసి, గదిలోకి చక్కాపోయింది విసవిసా. ఏ భావానికీ ఆస్కారంలేని ఆ చూపుల్లో కోటి భావాలూ భాసించాయి రాఘవేంద్రానికి. కారణమైనా కనుక్కోకుండానే, అడుగులో అడుగు వేసుకుంటూ అర్ధాంగిని అనుసరించాడు.

తన వెంటే గదిలోకి చక్కా వచ్చేసిన ప్రాణేశ్వరుణ్ణి పట్టున చూసుకుంటూ, రెండే రెండంగల్లో పోయి గది తలుపులు బంధిస్తూనే ఛటుక్కున, గిర్రున వెనక్కు తిరిగింది రామాయమ్మ "మిమ్మల్నే—" అన్నది ఓ రంకె వేస్తూ.

త్రుళ్ళిపడ్డాడు రాఘవేంద్రం!

ఉరుమైనా లేకుండానే మెరుపు, కోటి అశని పాతాలొక్కుమ్మడిగా అతగాడి నడినెత్తిన వర్షించి నట్లయింది.

"ఎవర్నీ—" అంటూ యిల్లాలి కభిముఖంగా తిరిగాడు.

"వారినీ వీరినీ పిలవడానికేం ఖర్మం, ఎలుగెత్తి?...'

రాఘవేంద్రాని కర్థం కాలేదు..."చెట్టంత మొగుడూ అత్తగారూ సాయిబులా సరసన గుమాయించేస్తూంటేనూ—" అని రామాయమ్మ పూరించేదాకా. తీరా నిలబడి అంతా విన్నాక, ఆసాంతం అంతా అర్థం అయిందనుకున్నాక, తన వేపోసారి చూసుకుని...సిల్కు లాల్చీ వాసనలకు మురిసిపోయి, ఆ 'శ్రౌఫా'ను సమీపించకుండా ఉండలేకపోతున్నాడు.

"ఏమిటా పొగరుబోతు వేషాలు!" అల్లంత దూరానే నిలవేసింది, ఒకే ఒక్క ఉరుముతో తాళి కట్టిన పెనిమిటినే, రామాయమ్మ!! ఇంకా ఉపేక్షిస్తూ కూర్చుంటే కఠోరమైన తన నిర్ధారణ ఎక్కడ నీరుకారిపోతుందోనని సందేహిస్తూ, "ఒక్కమాట—" అంది, నొక్కి నొక్కి పలుకుతూ—ఆ నాలుగక్షరాల్నే, గుడ్లు రెండూ సాధ్యమైనంత పెద్దవిచేస్తూ.

"ఏమిటో అది—" సాగదీసుకుంటూ మరికొంచెం చనువు తీసుకోబోయాడు రాఘవేంద్రం. కాలకూట విషాన్ని చిలికి చిలికి నిలబడి అమృతం తీయగల ప్రజ్ఞ ఒక్కటే రాఘవేంద్రం సొత్తు.

"చెబుతున్నాను. అట్లా చూడండి—" రుద్రచండికలా గర్జించింది రామాయమ్మ, చేయెత్తి చూరు వైపు చూపిస్తూ.

అంతా తయారుచేసి సిద్ధంగా అమర్చి ఉంచిన ఉరిత్రాడు దక్షిణ వాయువులకు ఊయల లూగుతోంది.

సమ్మెటలో నిలబెట్టి నుదుటన మోదినట్లయింది రఘగాడికి.

రమణీయమైన సన్నివేశం అభినయింపబడుతోందని ఉబ్బి. తబ్బిబ్బైపోతూన్న రాఘవేంద్రం ఉలిక్కిపడుతూ వచ్చి నా స్వప్నంలో చక్కా మేల్కొన్నాను! ఆ రమణీయతను కోటి హస్తాలతో కౌగలించుకుంటూ కళ్ళు మూసినక్షణంలోనే దిగజారిపోయింది—

“రావుడూ—”అని అరిచాడు రఘువేంద్రం.

అగుపేశారది, అసలు వేయి నిలువుల లోతుగల నూతిలోనుంచి కొనవూపిరితో—ఓ పిశాచం ఉండేలాటి ఆర్తనాదంలా ప్రతిధ్వనించింది...ఆ స్వరం.

రామాయమ్మ వడ్డించి దోసిట కొంగును ఒక్కింత కొక్కెంపుగా బిగించుకుంటూ “ఏమి—” అంది, భీతావహమై పాలిపోతున్న పెనిమిటి ముఖంలో ముఖముంచుకూ.

నాలుగు క్షణాలు నిశ్శబ్దం.

మృత్యుదేవత రాకను ముందుగా స్వాగతాలు పలుకుతున్నట్లుంది, వారిద్దరి స్థితి సమన్వయించి చూస్తే.

తల్లడిల్లిపోతుంది రామాయమ్మ... కిటికీ కుండా చీకట్లో మినుకుమినుకుమంటూన్న నుడ్డినక్షత్రాలను లెక్కపెట్టేలా దృష్టంతా అటే కేంద్రీకరిస్తూ. లెక్క మరి ఎంత తేలిందో ఏమిటో లాగిన కొంగును లేని ఓపికతో తిరిగి బిగిస్తూ...

“అవును. ఒక్కటే నిర్ణయం. ఇక ఈ భూమ్మీద మీరో—నేనో ఒక్కరే బ్రతకాలి; అంతే! గుండెల మీద చేయి వేసుకుని కులపెద్దల ముఖాలు చూస్తూ చెప్పండి...మీరు బ్రతకడం ఎక్కువ అవసరమా, నేను బ్రతకడం ఎక్కువ అవసరమా?”

రాఘవేంద్రానికి ఈ మాటలలో సగం వినిపించి ఉంటాయేమో నిప్పులు కక్కుతూ ఆ చీకట్లో భీకరంగా ప్రజ్వలిస్తూన్న ఆ రెండు కళ్ళనూ చూసి కంపించిపోతూ విన్న విషయంలో ఏ కొంత మాత్రమో అర్థం చేసుకుని ఉంటాడు. ఉన్న తెలివి కూడా నీళ్ళు కారిపోయిందంతలోనే; మమ్మార్లా మందుడై చూస్తూ నిలబడిపోయాడు.

ఈ పిచ్చి ముఖభావంతో రామాయమ్మ కోపం రెచ్చిపోయింది! అయినా సంబాళించుకుంటూనే శక్తివంచన లేకుండా, ఆవేశంతో అనసాగింది—

“ఎన్ని చెడుతిరుగుళ్లు తిరిగినా, ఎన్ని పాపాలు మూటకట్టుకున్నా, పిల్లకాయల్ని మాత్రం యిగరేసి చంపకోవని చేతిలో చెయ్యేసి చెప్పండి. నిశ్చింతగా పోయి ఆ ఉచ్చులో నా మెడ బిగించుకుని చచ్చి ఊరుకుంటాను లేదా, ఏ కలవారి కాళ్ళో పట్టుకుని, నీళ్ళ బిందెలు మోసో, కూలిగాలు చేసో పిల్లల్ని నేను పోషిస్తాను...తినీతాగక్క నే మహాయోగ్యుల్ని మన్నించే రోజులు కావు గనక యిది, పోయి ‘రామా—కృష్ణా’ అనుకుంటూ, మీరే ఆ పని చేయండి!”

“రామ—దూ...” అదిరిపడి ఒక్క కేక పెట్టాడు రాఘవేంద్రం.

మహాశిలలో అణువైనా కరిగే సూచన లవుపించటంలేదు!

“రావుడూ లేడు...దేవుడూ లేడు! ఇదే అంతిమ నిర్ణయం. త్యాగాలు చేసిన పూర్వుల్ల పేర్లు చెప్పుకుని విఱ్ఱవీగే పురుషత్వం కదా...ఎట్లా మరి తేలేస్తారేం? అయిదు నిమిషాల్లో అంతా మరి తేలిపోవాల్సిందే.”

—పక్కా అయిదునిమిషాలు లెక్క తప్పకుండా గడిచి పోయాయి!

పుట్టాక ఆలోచించడం, అభిమాన పడటం, అన్న రెండు తత్వాలూ ఎరుగని రాఘవేంద్రం ఏ ఆలోచన చేశాడో, ఏ అభిమానాలకు పోయాడో...

అంతేనా అని రెట్టిస్తూన్నట్లుగా తలపంకించాడు. ప్రియురాలికోసం చక్రవర్తిత్వాన్ని కాలదన్ని గద్దె దిగి చక్కావస్తూన్న సామ్రాట్టులా—కుర్చీలోనుంచి లేచి నిలబడ్డాడు. తొణకలేదు... రామాయమ్మ బెణకనైనా లేదు!

అడుగులో అడుగు వేసుకుంటూ పోయి నులక మంచం ఎక్కి నిలబడి, మెడ రిక్కించి రామాయమ్మ ముఖంలోకి సగర్వంగా ఓ చూపు చూశాడు. చూస్తూనే ఉచ్చులో తలదూర్చి, అందుబాటు కని అమర్చిన నులక మంచాన్ని బలంకొద్దీ కాలితో వెనక్కు తన్నేశాడు!

“ఏమయ్యోర్నీ—” అన్న వెఱ్ఱికేకతో ఒకే ఒక్క అంగలో పోయి గుండెలకు హత్తుకుంది భర్తను, పాపం రామాయమ్మ! ఆ తరక్షణం ముగియకుండానే మంచం ముందుకు లాగి, మునివేళ్ళతో దానిమీదకు ఎగిరి నిలబడి, ఒణికే వేళ్ళతో ఎలాగో ఆ ఉచ్చు సడలించి, విజయగర్వంతో మిలమిలలాడుతూ తేజరిల్లిపోతూన్న పెనిమిటి ముఖాన్ని ముద్దులతో ముంచెత్తింది. “మీరా—మీరా...” అంటూ మాటి మాటికీ.

రామయమ్మను కౌగలిపట్టుకున్నాడు రాఘవేంద్రం.

పట్టు సడలించుకుంటూనే కస్సున లేచింది రామాయమ్మ.

# రిక్తహస్తాలు

"చాల్లెండి మరి! సిగ్గూ లజ్జా లేకపోతే సరి... బొత్తిగా. లోకులు నిలవేసి పోతుస్తారనైనా వెరవద్దా? సంపాదన లేకపోనే సరేసరి... సిస్తులన్నా పొదుపు చేసుకోకపోతే ఎట్లా? అంతా ఈ రాత్రి ఆ రండల పాదాల చెంత కుప్పవేసి, పిల్లతో మరి తెల్లారి ఎట్లా వేగుదామనుకుంటున్నారూ?"

అంతటితో సరిపెట్టుకోకుండా, రసభంగం కావిస్తూ రామాయమ్మ కృపాగా నిత్యం ఉండే గొడవలనే తిరగతోడుతూంటే నవ్వొచ్చిందా సమయంలో, అతగాడికి.

నవ్వేశాడు, పకపకా.

విశ్వస్త్రమునుజేసి ద్రావకాలు కుమ్మరించినట్లయింది రామాయమ్మకు. "అంతకన్నా పోయి చావరాదూ—"... అతగాని బదులు తానే అభిమానపడుతూ వందరెట్లు, గ్రుక్క నీరు కుక్కుకుంది రామాయమ్మ.

"రావుడూ—" దీనంగా చూశాడు.

ఎదురు చెబుతాడనుకుంది కోపంతో కనీసం ఈ మాటకైనా. భర్తే జవాబు చెప్పక కిమ్మనకుండా తను కక్కిన విషాన్ని దిగమింగుతూ భరిస్తూండటం చూస్తూంటే రామాయమ్మ మనసును కోటి చీడపురుగులు తొలుచుకుతూన్నట్లవుతోంది!

"పైగా రావుడూట... గావుడూ! అసలు దాని సొమ్ము తింటున్నందుకే అభిమానపడి చావాలి. పై పెచ్చు ఆ ఎంగిలి కూడు మూటగట్టుకొని సాని కొంప లమ్మటా—జూదం కొంప లమ్మటా పడి తిరగడానికి... రామచంద్రా... పురుగుల్లో కూడా ఉండే వివేకయ్యా, ఈ మొగజాతిని!" అంటూనే రెండు చేతులూ ఎత్తి నెత్తి బాదుకుంది, పాపం.

గొల్లున నవ్వాడు, మళ్ళీని.

చురచురా చూసింది తలగాడికేసి, రామాయమ్మ నమిలి మింగేసేదానిలా.

రాఘవేంద్రం భాష్యం:

"అంత శక్తిమంతుడూ, మహిమాన్వితుడూ అయిన రామచంద్రుడికే ఆమాత్రం అభిమానం ఉండదంటావా, సాటి మొగజాతిమీద!"

"ఆ జన్మిచ్చినవాడికైనా ఉండాలి... ఈలాటి అసమర్థుల్ని భూమ్మీద పడేయరాదన్న జ్ఞానం..."

ముక్కూ మూతీ తుడుచుకుంటూ రామాయమ్మ పాపం యింకా ఏమేమో వాపోతూనే ఉంది. చీమ కుట్టినట్టయినా చలించకుండానే నిలువునా మంచం మీద వ్రాలి నిద్రాణంలోపడి గుర్రు పెట్టసాగాడు రాఘవేంద్రం.

దూసుకుంటూ వచ్చింది ఒక్క తీవ్రమైన నిట్టూర్పు, రామాయమ్మ గుండెల్ని.

గంపగయ్యాళి రామాయమ్మ అని తలపోస్తే నిజంగా పాపం మనకో ఒరిగే క్షేమమీ లేదు.

పూర్వాశ్రమంలో రామాయమ్మ పాటిలేని వినయవతి! తండ్రి వరసన ముప్పొద్దులా కూర్చుని రామాయణ భాగవతాదులు ఆసాంతం పఠించి జీర్ణించుకున్న విద్యావతి. ఆయా సమయాల్లోనే పతివ్రతా శిరోమణులంతా, అంతోయింతో తమతమ ప్రభావాల్ని ఆ లేతమనసుపై రుద్దేశారు.

వినయవతీ, సహనవతీ అన్న కీర్తిని సముపార్జించుకున్న రామాయమ్మకు ఏదో యింత నీడున్న మారాజును చూసి కట్టబెట్టేశాడు, రామయమ్మ తండ్రి.

ముళ్ళు పడ్డంతవు... మొగుడంటే మానవమాత్రుడేకాక మరేమిటో అని తలపోయసాగింది. ఆ 'ఏమిటో' అంతా అత్తింటికి తరలివచ్చాక 'ప్రత్యక్ష దైవం'గా పరిణమించింది. అంతే... పాపం, ఆ పిచ్చి కూన కాళ్ళు కడిగి బురద త్రాగడం మినహా అంతా చేసేసింది!

పరాత్పరుని పిలుపు విని అత్తా మామా సెలవు తీసుకున్నారు. వియోగభారంతో ఏ ఒక్కరూ క్రుంగి పోకుండా. ఒక్క మాసంలోనే.

'ప్రత్యక్ష దైవం' అసలు రంగు బయటపడింది. మరోమాసమైనా మళ్ళకుండానే వారసత్వమంతా వచ్చి ఓనాడు వీధరుగుమీద విశ్రమించింది.

'వ్యవహారాల'కని చెప్పి [illegible] మరకుండా బయటకు పోయిన రాఘవేంద్రం యింకా యింటికి తిరిగి రాలేదు.

అత్తా—మామా ఒక్కమాసంలోనే నిధనం పొందినందుకు కరుణాహృదయులు వీళ్ళంతా తమ్ము పరామర్శించడానికి వచ్చారనుకుంది పాపం, రామాయమ్మ.

"అబ్బే, కాదమ్మా—" అన్నట్లుగా ఉన్నాయి వాళ్ళ ముఖాలూ. "మరి—?" అనుకుంటూ ఎంతసేపో గడిపింది.

యుగాలే నిముషాలై పరువు లెత్తుతున్నాయా, లేక నిముషాలే యుగాల్లా వేధిస్తున్నాయా యిదమిత్థంగా తేల్చుకోలేకపోయింది. ఏమిటీ రాడూ... వీళ్ళెవరూ!

"సిగ్గులజ్జా లేకపోతే సరి పాడుమనుషులకి... ఒంటరిగా ఆడకూతురు యింట్లో మసలుతూంటే తిరుగునమ్మ అని అరుగులమీద కైవాయించడానికి!" అని పళ్ళు కొరుకుతూపోయి సంజదీపం వెలిగించి కళ్ళకద్దుకుంది.

చూస్తుని చూస్తుని వాళ్ళు సైతం పాపం విసిగి పోయారు.

"సరే. మేం మరి వస్తా మమ్మాయీ. అతగాడు రాగానే మరిచిపోకుండా, ఆ గుణాల సంగతి తేల్చుకునేటందుకు మేం వస్తామని చెప్పి పంపించు." అంటూ ఓ పెద్ద మనిషి లేచి నుంచున్నాడు. ఉసూరు మంటూ మిగిలినవాళ్ళుకూడా భారంగా శ్వాస విడుస్తూ అడుగులు దిగి అతని ననుసరించారు.

గు...ణా...ల సం...గ...తి !!!

—రామాయమ్మ స్థితి వర్ణించడానికి మరి చాలా పాండిత్యం కావాలి.

తడబడుతూ, తలుపు ఒకింత ఓరచేసుకుని, "ఇ...ఇ...ఏఏ గుణాల...సం...గ...తం...డీ??" అంది వణికే స్వరాన. కాళ్ళు స్వాధీనం తప్పిపోతున్నాయి ... పరపురుషులతో మాట్లాడినపాపాన పోలేదప్పుడు. పుట్టాక అసలు 'గుణం' అంటే ఫలానా అని ఎరుగనైనా ఎరుగదు పాపం!

ఎట్లాగో ఈ స్వరం యిందాకటి పెద్ద మనిషి చెవిలో దూరింది. ముందుకు వేస్తున్న వాళ్ళల్లా సావధానంగా వెనక్కు తిరిగి చూస్తూ..."ఆడవాళ్ళు, నీకెందుకమ్మా ఈ వ్యవహారాలు... మేమూ మేమూ చూసుకుంటాంలే—" అంటూ సెలవు తీసుకున్నాడు.

—అన్నట్టుగా అల్లాగే చూసుకున్నారు, వాళ్ళూ వాళ్ళూను. నాలుగైదు రోజులు గడిచిపోయాయి.

"మరేం చేద్దాం—" అన్నాడు రాఘవేంద్రం. తాపీగా ఆ తర్వాత.

"అంటే—" అంది అర్థంకాక, అయోమయంగా రామాయమ్మ.

ఈ నాలుగైదు రోజుల్లోనూ మునుపొచ్చిన ఆ సామీలనుగురించి తానైనా ఏమీ అడగలేదు రామాయమ్మ.

"అంతే మరి!" అన్నాడు రాఘవేంద్రం, అంతా విశదీకరించాక.

అంతా విశదీకరించాడు. ఒట్టుకు ఒక్క విషయం దాచలేదు !!

"అయ్యో నా బిడ్డలో..." అని గోడిస్తూ నిద్రిస్తున్న పసిపాపల్ని లేవదీసి గుండెలకు హత్తుకుంది గాఢంగా.

వదిలి వింతగా చూసింది భర్తవేపు, ఆ ఆవేశంలోనే. ఓ క్షణం.

ఒక్కక్షణం మాత్రమే. తరువాత క్షణంలోనే ఎవరో కోటి కంఠాలతో తన చెవుల్లో ఊదారు గాబోలు...'పతియే ప్రత్యక్ష దైవం !" అని.

"మీరే చెప్పండి—" అంటూ, తన క్షణికావేశాన్ని నిగ్రహించుకుని పశ్చాత్తాపంతో క్రుంగిపోయింది పాతాళానికి.

ప్రాణేశ్వరుడు నిరాధారంగా నిలబడి చేతులు దులుపుకోవటం చూస్తూండగానే లోకం తీరుతెన్నులు యథాతథంగా ఆమెకు అవగాహన కాసాగాయి. లోకం తాను అనుకుంటున్నట్లు—ఉగ్గూ పాలూ మారాలు లేకుండా పెరిగి బుద్ధిగా అణకువనే మంచి బాలుడిలా—సంచరించటం లేదు. ఇన్నాళ్ళుగా తనకు తెలిసిన లోకం కాదిది. తనకు తెలిసిన మనుషులు కారు వీళ్లు. ఆటపాటల పేరిట ఆస్తులు దోచుకుంటూగా లేకపోతే యింత అమానుషంగా! మహాపాపం ఒకటున్నదని వీళ్ళ పెద్దలెప్పుడూ వీళ్ళకు వర్ణించి చెప్పలేదా ?

రామాయమ్మ రామాయమ్మలా లేదు.

క్రమంగా అర్థం కాజొచ్చింది లోకం తప్పు కాదనీ, లోకం ఎప్పుడూ తన కృత్రిమ స్వభావాలతో అచంచలంగా యిలాగే ఉంటోందనీనీ. లోపమంతా చంచలస్వభావుడూ ముందుచూపు లేనివాడూ అయిన తన భర్తదేననీనీ.

ఈ వేదన అంతా రోజులు గడుస్తున్న కొద్దీ అగ్నిపర్వతంలా తనలో పేరుకుపోయింది. లోకంలో ఉన్న సహనాన్నే ఎరువు తెచ్చుకున్నట్లుగా కళ్ళు మూసుకుని అంతా భరిస్తూ వచ్చింది. కాలక్రమాన పసుపూ—కుంకం పేరు చెప్పి తన పుట్టింటివారు ముట్ట చెప్పిందికూడా కరగటం ప్రారంభించాక, ముందు జాగ్రత్తకోసమైనా తాను కొంచెం కఠినంగా నిలబడి అవసర పరిస్థితులు సంక్రమిస్తే తాత్కాలికంగా అవసరాలను సైతం అధిగమించాలని కఠోరంగా సంకల్పించుకుంది.

ఆ అవసరం రానేవచ్చిందీనాడు. తాను కూడా నీళ్లు కారిపోకుండా నిలబడి 'నీనా—నేనా' అని సవాలుచేసింది. అతీంద్రియమైన దివ్యప్రబోధాలను పసికూనల ముఖాలు చూసి పెనిమిటిని చూస్తూ, కిమ్మనకుండా పెనిమిటి 'నీ సంగతా...యింతేగదా... నేను చూసుకుంటాలే—' అన్న ధోరణిలో పడిపోవడానికి సంసిద్ధపడటంతో, త్రొక్కిఉంచిన సంస్కారం అంతా వెయ్యి ఏనుగుల బలంతో విజృంభించి భర్తను ప్రతిఘటించకుండేలా చేసింది.

భవిష్యత్తును బాగుపరచడానికి పైన భగవంతుడు లేడా ? అందుకోసం మూర్ఖురాలై క్రూరంగా తాను పెనిమిటినే బలిపెడుతుందా...భగవంతునిపైనే భారంవేసి నిద్రిస్తున్న రాఘవేంద్రానికి కోటి నమస్కారాలు చేసింది రామాయమ్మ! పాపం...!!

* * *

కండక్టర్ కంగారు పడుతున్నాడు. కొద్దిగా మత్తునుంచీ కోలుకుని, ముందు కూర్చున్న డ్రైవర్ ముఖకవళికలు ప్రయాణికులకు అవుపించటం లేదు. ప్రార్థించే ఆ దీనులపట్ల భగవంతుని దయ ఎంత పరిమాణంలో ప్రసరింపనున్నదో రానున్న క్షణాలే విశదం చేయాలి!

# బిరుదనామధేయములు

## శ్రీ విక్రాల శేషాచార్యులు

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయం.

బిరుదములచేతనే పిలువఁబడెడు కవిపండితుల నెఱుఁగుటకుముందు కొంచెము ఆ బిరుదముల స్వరూపమును చర్చించుట సమంజసము. కాన తద్విషయము కొంచెము యత్నింతము.

ఆత్మజునకు జననీజనకులు బారసాలనాఁడు బంధుమిత్ర బృందము నెదుట హోమాదికార్యముల నెఱపి తమ పెద్దలయొక్కయో లేక యే యిష్టదైవము యొక్కయో గానున్న నిష్టమైన యొక నామమును బియ్యమునందు వ్రాసిపెట్టి యాతని యొక నామాంకితు నెట్లు జేతురో అట్లే విద్వాంసునకు గాని, కవికి గాని పండితులు సభయందు సారస్వతచర్చ యొనర్చి యుచితమైన యొక బిరుదమును 1ముద్రిత పత్రముమీఁద వ్రాసి యొసంగి యాతని నొక బిరుదాంచితునిఁ జేయుదురు. ఇది విద్వత్కవులకు విద్వత్కవుల సుహృత్తులైనవారు సలిపెడు ఒక నామకరణమని చెప్పదగు. నామకరణ మప్పుడు బంధువులు బిడ్డకు నాభరణాదులఁ జదివించునట్లు బిరుదప్రదానమునాఁడు పండితునకును సహృదయులు పండితపాలురు మొదలగువారెల్ల బహుమానముగ నొసంగెదరు. బిరుదములు విద్వాంసులయొక్క సామర్థ్యమునకు చిహ్నములు. ఎట్లన?

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారి పేరుకు ముందు తత్ గ్రంథములయందు "అవధాని శిరోమణి" బిరుదు ప్రత్యక్షమునం దాదిత్యునికన్న ముందుగ నరుణునివలె దృష్టమగుచుండు. శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులవారి కావ్యాంతములయందు "కింకవీంద్రఘటా పంచానన విద్వత్కవి బాలకళానిధి బాలసరస్వతీ శతావధాని" యను వారి బిరుదవాహిని కాశీ ప్రాంతమున గంగావాహిని వలెను దృష్టంబగుచుండు. మాతండ్రిగారు శ్రీ విక్రాల రామచంద్రాచార్యుల గారి పేరుతోటి "విద్యారణ్య పంచానన విద్యావాచస్పతి" యను వారి బిరుదద్వయము తద్గ్రంథమ్ముల శ్రీ మహావిష్ణుమూర్తితోటి తత్కర కమలములయందు శంఖచక్రములఁబలె పరిదృశ్యమానం బగుచుండు.

ఈ బిరుదములలో "విద్యారణ్యపంచానన", "కింకవీంద్రఘటాపంచానన", "అవధాని శిరోమణి" బిరుదములు మూఁడు పైఁజెప్పినవారికిఁ దప్ప మఱియెవరికిని లేమిఁ జూచి, రఘువంశమునందు—

హరిర్యథైకః పురుషోత్తమః స్మృతో
మహేశ్వరస్త్ర్యంబక ఏవ నాపరః,
తథా విదుర్మాం మునయః శతక్రతుం
ద్వితీయగామీ నహి శబ్ద ఏష నః.

అని రఘువుతో దేవేంద్రుఁడు పలికినమాట స్మరణమునకు వచ్చుచుండును.

సాహిత్యవిద్యాప్రవీణ లోనైనవియు బిరుదప్రాయములే యైనను అవి కళాశాలలయందు నిర్ణీతములైన గ్రంథభాగములఁ జదివి వాటిలోఁ బరీక్షలయందు తీర్ణులయినవారికి తదధికారులచేత దేయములై యున్నవి.

భారతదేశము ఖండాంతరవాసుల పాలనమునకు లోనై యున్నకాలము మొదలుకొని కొన్ని బిరుదములు దొరతనమువారినుండి గడించఁదగినవైనవి. క్రీ. శ. 1887 వ సం॥మున జరిగిన విక్టోరియా జూబిలీ సందర్భమున ఇంగ్లీషు దొరతనమువారినుండి "మహామహోపాధ్యాయ" బిరుదము శ్రీ పరవస్తు వేంకటరంగాచార్యులయ్యవార్లంగారు మున్నగు నలుగురు భారతదేశ విద్వాంసులకు లబ్ధమైనది. (చూ. ఆంధ్రపత్రిక శుక్ల సంవత్సరపు ఉగాదిసంచిక పుట-270) కొన్ని ప్రసిద్ధములైన పరీక్షా సంస్థలచేత నొసంగఁబడునవిగ నున్నవి. అన్నింటిని వెనుక తెలిపెదను. "క్షితి మహారాష్ట్రభాషచేఁ జెప్పఁబడెను ధీకరోక్తులు బిరుదులై పెక్కుదనరు" అని బిరుదములనుగుఱించి అప్పకవీయము చతుర్థాశ్వాసమునందు చెప్పఁబడినది కాని విద్వత్కవుల కొసంగఁబడెడి బిరుదములు ప్రాయికముగ సంస్కృతభాషామయములుగనే యుంటున్నవి. ప్రతివాదిభయంకర, విద్వజ్జన కోలాహల, కవిసార్వభౌమ కవిరత్నాదులింతకుదాహరణములు.

బిరుదములను ప్రాచీనులు వాడుచుండిరి కాని "బిరుద" శబ్దమును మాత్రము తఱచుగ సంస్కృత

1. మహర్షులకు సదృశుఁడనియో (అభినవ వాల్మీకి.), పూర్వకవులకుఁ దుల్యుఁడనియో (అభినవ కాళిదాస.), లేక గొప్పవాఁడనియో, శ్రేష్ఠుండనియో (మహాకవి. కవిసింహ.) ఇత్యాద్యర్థముగల బిరుదములు.

గ్రంథకర్తలు వాడినట్లు కానరాదు. [2]సాహిత్య రత్నాకర[3] వాసంతికాపరిణయాది కతిపయ గ్రంథములలో మాత్రము కనిపించుచున్నది.

బిరుద శబ్దము ఏ భాష ? ఇది సంస్కృతశబ్దము కాదని తలంచి సంస్కృత విదులే కొందరు దీనికి సంస్కృతములో నేమి పేరు కలదని ప్రశ్నింతురు. అట్లు కాదు. ఇది సంస్కృతపదము. అట్లు పూర్వోక్త వాసంతికాపరిణయనాటకములో పంచమాంకమునం దొక శ్లోకముయొక్క అధోజ్ఞాపిక (ఫుట్‌నోట్) లో తన్ముద్రాపకులు (మైసూరు శ్రీ ధర్మాధికారిచక్రవర్తి అయ్యంగార్, విద్యాతరంగిణీ ముద్రాశాలాధ్యక్షులు) కేశవ నిఘంటువునుంచి ప్రమాణము వ్రాసియున్నారు. ఆ నాటక శ్లోకము, నిఘంటు శ్లోకమున్ను ఇవి :

సర్వస్వస్తి జపంతి యోగిపురుషా
గాయంత్యమీ శోభనం
గంధర్వాప్సరసం నటంతి పురత
స్స్వారాజ్యవారాంగనాః,
దివ్యా వందిజనా స్తువంతి బిరుదం
దీపోత్సవం పంక్తిశః
సూర్యా ద్వాదశ పాదయన్తి సుధయా
చంద్రో భువం సించతి."

"సపత్న విజయ ఖ్యాతి-చిహ్నం
బిరుదముచ్యతే."

అని. ఆంధ్రభాషార్ణవము 2 వ కాండ తృతీయ వర్గమునందు పవాడమున కర్థముగ నీశబ్ద మిత్యబడి యున్నది. "బిరుదము బిరుదనఁ బవాడ మనఁగను బరగు నభవ!" (ప. 193)

శ్రీ బ. సీతారామాచార్యులగారు శబ్దరత్నాకరమునందు - సంస్కృతము పుల్లింగమని వ్రాసియున్నారు. బిరుదమనునది దీని వైకృతము. (చూ. శబ్దరత్నాకరము) వాచస్పత్యమంతటి బృహదభిధానమ్మున వ్రాయమికిఁ గారణము చింత్యము.

బిరుదమునకు బదులు పూర్వము పదశబ్దము, నామశబ్దము, దానిపర్యాయములు వాడఁబడునట్లు బహుగ్రంథ పర్యాలోచనవలన తెలియుచున్నది. పద ప్రయోగమున కుదాహరణము—భవభూతి మహావీర చరిత్ర నాటకము ప్రథమాంకమున ప్రస్తావనయందు, "......తత్రకేచి త్తైత్తిరీయిణః......పవిత్రకీర్తేర్నీల కంఠస్యాఽఽత్మసంభవః శ్రీకంఠపద లాంఛనో భవభూతిర్నామ జాతూకర్ణీపుత్రః కవి......" ఇత్యాది. ఇచ్చట శ్రీకంఠ శబ్దమునకు "శ్రీర్భారతీ కంఠే యస్య స ఇతి పదభూషణోఽర్థాత్ శ్రీకంఠోపాధికః."

అని శ్రీ జీవానంద విద్యాసాగర భట్టాచార్య రచిత టీక. ఉత్తరరామచరిత్రమునం దాపదమునకే రామచంద్ర బుధేంద్ర విరచిత భావబోధినీవ్యాఖ్య: "శ్రీకంఠ పద లాంఛనః లాంఛనం పరిచాయకం చిహ్నం విశేషణ మితియావత్. శ్రీర్వాగ్దేవీ కంఠే యస్య శ్రీకంఠః శ్రీకంఠ ఇతిపదం లాంఛనమస్య శ్రీకంఠ పదలాంఛనః శ్రీకంఠ విశేషణక ఇత్యర్థః."

అనఁగా రెండుగ్రంథముల యందలి శ్రీకంఠ పదలాంఛన శబ్దమునకు శ్రీకంఠుఁడను పదము చిహ్నముగాఁగలవాఁడని తాత్పర్యము. శ్రీకంఠుఁడన శ్రీయన వాగ్దేవత సరస్వతి. ఆమె కంఠమునఁగలవాఁడని యర్థము.

నామశబ్దమును వాడుట కుదాహరణము — ప్రపన్నామృతము 84 వ అధ్యాయమున భగవద్రామానుజులవారికి భారతీదేవి భాష్యకార బిరుదము ననుగ్రహించిన ఘట్టము :

ఇత్యంగీకృత్య వాగ్దేవీ శ్రుత్యర్థం తేనభాషితం,
తస్యాఽకరోద్భాష్యకార ఇతి నామ ముదా తదా.

అని.

బిరుదమునకు పర్యాయ (బదులు) నామములు:- గుణ నామధేయమనియు ఉపనామమనియు ఉపాధియనియు మరియును పేర్లుగలవు. గుణనామధేయమునకు ఉదా: వేదాంత దేశికుని సంకల్ప సూర్యోదయ నాటకము 1 వ అంకము ప్రస్తావనలో—సూత్రధార వాక్యము—"కవితార్కిక సింహ ఇతి ప్రఖ్యాత గుణ సమాఖ్యః" అని. సమాఖ్యా నామధేయం ప్రఖ్యాతగుణ నామధేయః అని తద్వ్యాఖ్య ప్రభావళి. కవితార్కిక సింహః అని ప్రఖ్యాతమైన గుణనామధేయము గలవారని యర్థము. ఉపాధిశబ్దప్రయోగమున కుదా:-శ్రీమాన్ మాతంగ్రిగారి విద్యావాచస్పతి బిరుదపట్టాలో "నవద్వీప బుధైః ప్రీతై స్తద్గుణగ్రామదర్శనాత్, విద్యావాచస్పతీత్యాఖ్యోపాధి రస్మై ప్రదీయతే" అని. ఉపనామ పదప్రయోగమున కుదాహరణము:- పైదాని యందే, "న్యాయ పంచానన తర్కతీర్థోపనామక శ్రీ శశాంకభూషణ శిరోమణి శర్మభిః." అని. కనుక బిరుదము పదము గుణనామము ఉపనామము ఉపాధి విశేషణము అను నీ నాలుగు నేకార్థవాచకములు.

బిరుదార్హులు:—పాండిత్య పాటవము చే త పండితులకు వలెనే వితరణ వీర్యాదిగుణ ప్రకర్షముచేత ప్రశస్తులైన వారికిని బిరుదము లొసంగఁబడును.

---

2. వారాణసి ధర్మసూరి. 3. శ్రీవత్స శఠారి యతీశ్వరరచితములు.

# బిరుదనామధేయులు

వితరణ ప్రకర్షమున కుదాహరణము: విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులవారు. ఇందు తొలి రెండు బిరుదములు వితరణ విషయకములు. కళాప్రపూర్ణ పదము విద్యావిషయకమైనది. వీరియందు త్యాగ విద్యలు రెండును నెలకొనియున్నందున తత్సంబంధములకు సరియైన బిరుదములు విలసిల్లినవి.

బలాతిరేకమున కుదాహరణములు: అభినవ భారత భీమ, ఆంధ్ర కిశోరకంఠీరవ, జగదేకవీర, మల్ల మార్తాండ, మల్ల రాజతిలక, వీరజయ హనుమాన్ శ్రీ కోడిరామ మూర్తి నాయుడు గారు. ఇవి యన్నియు వారి వారి విజ్ఞాన దానశక్తి ప్రముఖ గుణసూచకములు!

బిరుదములు కొన్ని వారి వారి కవిత్వ పాండిత్యాదులం దిలకించి పండితులు సభలం బరీక్షించియు తత్సామర్థ్య సూచకముగాం గల్పించి యిచ్చునవిగ నున్నవి. కొన్ని నప్పుడప్పుడు క్రొత్తవియు నుదయించుచుం గలవు. ఇప్పటి కుదయించిన బిరుదపుంజములో కొన్నింటి నిటం జేర్కొనుచున్నాము. సమయోద్దండ కోలాహల, షడంగవేదజ్ఞ, శ్లేషయమక చక్రవర్తి, సంబుద్ధాగమ చక్రవర్తి, శాస్త్రవాచస్పతి, విద్యా వాచస్పతి, విద్యారణ్య పంచానన, విద్యార్ణవ, విద్యానాథ, విద్యానిధి, విద్వన్మణి, విద్యాలంకార, విద్యాసాగర, విమర్శకాగ్రేసర, విద్వత్కవి చక్రవర్తి, వాదికేసరి, బాలసరస్వతి, బాలకళానిధి, ప్రౌఢ సరస్వతి, పండితరాజ, ప్రతివాదిభయంకర, కవిసింహ, కవికుంజర, కవిసార్వభౌమ, కవిశేఖర, కవితిలక, కవిరత్న, కవిభూషణ, కవి వల్లభ, కవికంఠీరవ, కవిగండభేరుండ, మహాకవి, ఉపన్యాసభూషణ, అభినవపండితరాజ, అభినవభట్టబాణ, అభినవ కాళిదాస, అభినవవ్యాస, అభినవ వేదాంతాచార్య, అభినవనిగమాంతాచార్య, విద్యాసాగర, కవితార్కికసింహ, కవితార్కిక కంఠీరవ, కవివైద్యపురందర, కవిగణకసార్వభౌమ, అనుష్టుప్ చక్రవర్తి, సంబుద్ధాగమ చక్రవర్తి, కావ్యరత్న, వేదాంతరత్న, వేదాంతతీర్థ, వేదాంతవాచస్పతి, తర్కవాచస్పతి, విద్యాభూషణ, తర్కవాగీశ, తర్కవేదాంతభూషణ, బ్రహ్మతంత్రస్వతంత్ర, కావ్యవ్యాకరణతీర్థ, తర్కవ్యాకరణతీర్థ, కావ్యస్మృతితీర్థ, కావ్యతీర్థ, స్మృతి తీర్థ, తర్కతీర్థ, న్యాయరత్న, స్మృతిరత్న, దైవజ్ఞ రత్న, దైవజ్ఞ సింహ, దైవజ్ఞ వాచస్పతి, సాహిత్య సరస్వతి, వేదార్థవాచస్పతి, జ్యోతిషాయుర్వేద విద్వాన్, సాహిత్యాచార్య, వ్యాకరణాచార్య, సాహిత్యవిశారద, సాహిత్యశిరోమణి, వ్యాకరణ శిరోమణి, భిషగ్వర, ఆయుర్వేదాచార్య, ఆయుర్వేద భూషణ, మహామహోపాధ్యాయ, వైద్యరత్న, పండిత రత్న, భారతరత్న, కావ్యకంఠ, కళానిధి, కళా ప్రపూర్ణ, వ్యాఖ్యానవాచస్పతి, పండితసార్వభౌమ, పండితమార్తాండ— మొదలుగాం గలవి.

వివిధ సంస్థలచేతను నివ్వంబడు బిరుదములు కొన్ని :

సర్వతంత్ర స్వతంత్ర, సమయోద్దండ కోలాహల, సంబుద్ధాగమచక్రవర్తి, సాహిత్య సరస్వతి, షడంగవేదజ్ఞ, శాస్త్రవాచస్పతి, విద్యావాచస్పతి, విద్యారణ్యపంచానన, విద్యార్ణవ, విద్యానిధి, విద్యాసాగర, విద్యాలంకార, విద్యానాథ, విద్యాభూషణ, వైదికసార్వభౌమ, విద్వన్మణి, విద్వత్సింహ, వ్యాఖ్యాన వాచస్పతి, వేదార్థవాచస్పతి, వేదాంతవాచస్పతి, వేదాంతభూషణ, విద్వత్కవిచక్రవర్తి, వాదికేసరి, వైయాకరణ పంచానన, ప్రౌఢసరస్వతి, బాలసరస్వతి, బాలకళానిధి, బాలవాల్మీకి, ప్రతివాది భయంకర, పండితరాజ, పండితసార్వభౌమ, పండిత మార్తాండ, తర్కవాగీశ, తర్కవాచస్పతి, బ్రహ్మతంత్రస్వతంత్ర, కార్తాంతికాగ్రేసర, కళానిధి, కళాప్రపూర్ణ, కవికుంజర, కవితిలక, కవిరత్న, కవిశేఖర, కవిభూషణ, కవి వల్లభ, కవిసింహ, కవికంఠీరవ, కవిరాజ, కవిసార్వభౌమ, కవిచక్రవర్తి, కవిచూడామణి, కవిశిరోమణి, కవిసమ్రాట్, కవితాకోవిద, కవితాకళానిధి, కవితా చతురానన, చతుర్విధ కవితా చతురానన, మధురకవి, మహాకవి, మహాకవిశిరోమణి, బాలకవి, ప్రౌఢకవి, సరసకవి, చిత్రకవి, విశ్వకవి, మహాకవి, కవిరాజశిరోమణి, కవివైద్యపురందర, కవితార్కికసింహ, కవిగణకసార్వభౌమ, జ్యోతిషాయుర్వేద విద్వాన్, దైవజ్ఞవాచస్పతి, ఉపన్యాసభూషణ, తర్క వేదాంతభూషణ, సభాభూషణ, అభినవపండితరాజ, అభినవవ్యాస, అభినవవాల్మీకి, అభినవకాళిదాస, అభినవ వేదాంతాచార్య, అభినవనిగమాంతాచార్య, దైవజ్ఞ సింహ, దైవజ్ఞరత్న, దర్శనరత్న, సాహిత్యరత్న, కావ్య రత్న, వేదాంతరత్న, న్యాయరత్న, స్మృతిరత్న, పండిత రత్న, వైద్యరత్న, తర్కతీర్థ, కావ్యతీర్థ, స్మృతితీర్థ, తర్కవ్యాకరణతీర్థ, కావ్యవ్యాకరణతీర్థ, కావ్య స్మృతితీర్థ, సాహిత్యాచార్య, వ్యాకరణాచార్య, వేదాంతాచార్య, ఆయుర్వేదాచార్య, సాహిత్య శిరోమణి, వ్యాకరణశిరోమణి, సాహిత్యవిశారద, సాహిత్యవిద్యాప్రవీణ, వ్యాకరణవిద్యాప్రవీణ, (ఉభయ) భాషాప్రవీణ, ఆయుర్వేదభూషణ, భిషగ్వర, మహోపాధ్యాయ, మహామహోపాధ్యాయ, విదగ్ధ చూడామణి, విమర్శకాగ్రేసర, విమర్శకశిరోమణి, శ్లేషయమకచక్రవర్తి, సుధీమణి మొదలైనవి.

